హనుమత్ సూక్త, హనుమాన్ చాలీసా, ఆంజనేయ దండక
మారుతి స్తోత్ర హనుమత్ బడబానల స్తోత్రసహిత

# శ్రీ రామ రక్షాస్తోత్రమ్

కోటిప్రతుల ప్రచురణ ప్రచారోద్యమము



ప్రతులకు

## పురాణపండ రాధాకృష్ణమూర్తి

జయశ్రీటాకీస్ రోడ్ - సూర్యాహోటల్ ప్రక్కన
డోర్ నెంబర్ 29-6-13డి: రాజమండ్రి-4.

# పితృదేవో భవ!

సోదాహృత శ్లోకములు :



ఉపన్యాస సార్వభౌమ, పురాణ వాచస్పతి

భారత, భాగవత, రామాయణ వ్యాఖ్యాత

**స్వర్గీయ పురాణపండ రామమూర్తి**

జన్మస్థలం : కాకరపఱ్ఱు - పశ్చిమగోదావరి జిల్లా

తూర్పుగోదావరి జిల్లా అన్నవరం గ్రామంలో
పంపానదీతీరంలో రత్నగిరిపై స్వయం వ్యక్తమై
హరిహర హిరణ్యగర్భ త్రిమూర్త్యాత్మకమై,
అనంతలక్ష్మీ సమేతుడైన

## శ్రీ వీరవెంకట సత్యనారాయణ స్వామివారు



మద్రాస్ : శివానందా ఛారిటబుల్ ట్రస్ట్ ప్రెశిడెంట్

**శ్రీ శ్రీ శ్రీ ఓం నారాయణ్ మహరాజ్ వారి**

సంపూర్ణ సహకార సౌజన్య, శుభాకాంక్షలతో

# శ్రీ వీరవేంకట సత్యనారాయణస్వామివారి దేవస్థానం
## అన్నవరం:: తూర్పుగోదావరి జిల్లా

తూర్పుగోదావరి జిల్లా అన్నవరం గ్రామంలో పంపానదీ తీరములో ప్రకృతి రమణీయతతో శోభిల్లితమగు రత్నగిరిపై వేంచేసియున్న శ్రీ వీర వేంకట సత్యనారాయణస్వామి స్వయం వ్యక్తమై హరిహర హిరణ్యగర్భ త్రిమూర్త్యాత్మకమైన శ్రీ మత్త్రిపాద్విభూతి మహా వైకుంఠ నారాయణ యంత్రమున ప్రతిష్ఠింపబడి శివసహిత అనంతలక్ష్మీ సతీసమేతుడైన శ్రీ వీరవేంకట సత్యనారాయణ స్వామిని సేవించు వారికి ఐహికాముష్మిక సకల సిరిసంపదలు కలుగును. మహా పుణ్యప్రదమైన శ్రీ వీరవేంకట సత్యనారాయణ స్వామివారి వ్రతము భక్తుల పాలిట కల్పవృక్షము, వరప్రసాదము. తత్ కారణమున ఈ స్థలమున శ్రీ స్వామివారి వ్రతములు అశేష భక్తవాహినిచే నిత్యమూ ఆచరించబడుచున్నవి.

భక్తుల సౌకర్యార్థము వివిధ సేవలు శాశ్వత ప్రాతిపదికపై ప్రతీ సంవత్సరములో వారు కోరిన ఏ రోజైన అట్టి పూజలు జరుపబడును. వాటి రుసుములు: శాశ్వత కళ్యాణము రూ. 3,000/- లు శాశ్వత విశిష్ట వ్రతము, శాశ్వత ప్రత్యేక వ్రతము, శాశ్వత వ్రతములకు వరుసగా రూ. 1,116/-, రూ 500/-, రూ. 300/-లు, శాశ్వత నిత్యపూజకు రూ. 250/-లు నిర్ణయించబడినవి. రూ. 35/-లు మనియార్డరు పంపిన యెడల శ్రీస్వామివారి వ్రతము భక్తుల గోత్రనామముతో జరిపించి పోస్టు ద్వారా ప్రసాదము పంపబడును.

## శాశ్వత అన్నదాన పథకము

అన్నదానం మహాభాగ్యము - అన్నవరం క్షేత్రములో అన్నదానం చేసి తరించండి. ఈ పథకములో సభ్యులుగా రూ.1,000/- లు, వాటికి రెట్టింపు మొత్తములు చెల్లించి చేరవచ్చును. ఆ సభ్యులు శాశ్వతముగా సంవత్సరములో వారు నిర్ణయించుకొను ఏ రోజైనసూ ప్రతీ వెయ్యి రూపాయలకు 25 మంది చొప్పున వారి పేర లేక వారు కోరిన ఎవ్వరి పేరునైనా అన్నదానము జరిపించబడును. ఈ అవకాశమును వినియోగించుకొని తరించండి.

ఈ మొత్తమునకు సెక్షన్ 80 (జి) ప్రకారం ఆదాయపు పన్ను మినహాయింపు కలదు. కావున భక్తులు పై సేవలందు విరివిగా పాల్గొని శ్రీ సత్యనారాయణ స్వామివారి కృపకు పాత్రులగుదురని ఆశించడమైనది.

## శ్రీ స్వామివారి బ్రహ్మోత్సవములు

వైశాఖ శుద్ధ దశమి నుండి వైశాఖ బహుళ పాడ్యమి వరకు శ్రీ స్వామి వారి బ్రహ్మోత్సవములు, శ్రావణ శుద్ధ విదియనాడు శ్రీ స్వామివారి జయంతి ఉత్సవము.

**రాజా ఐ.వి. రామ్‌కుమార్,**

చైర్మన్ మరియు వంశపారంపర్య ధర్మకర్త మరియు ధర్మకర్తల మండలి సభ్యులు

**మంచనపల్లి నరసింహారావు, బి.ఏ., బి.యల్.**

సంయుక్త కమీషనరు మరియు కార్యనిర్వహణాధికారి.

మీరు తరిస్తూ కనీసం మరి నూరుమంది తరించడానికి మార్గదర్శకులు అవండి. ఈ గ్రంథరత్నం మీ గృహసీమలో ఉంటే స్తోత్రరత్నాలన్నీ మీయింట వున్నట్లే. మీ దంపతులఫోటోతో మీవంశ పరిచయంతో లేదా మీ ఆత్మీయుల దివ్య సంస్మరణార్థం వారి ఫోటోతో రు3000-00లు మాత్రం అందజేసి ధర్మ తేజాన్ని పొంది దైవానుగ్రహానికి విశేష పాత్రులై ధన్యాత్ములకు మార్గదర్శకులయ్యెదరు గాక!

# దివ్యస్తోత్రరత్నావళి

సైజ్ 1/8డెమ్మీ : ఆఫ్ సెట్ ముద్రణ: బహు వర్ణ ముఖచిత్రం.

లక్షప్రతులు ప్రచురించబడి విశేష ప్రచారం కావాలి.

రూ 3000-00ల వంతున అందజేయగల వారిని సాదరంగా వేయి మందిని సత్వర సహకారం అందించ ఆహ్వానిస్తున్నాము.

ఈ విశాల విశ్వంలో కాలం
అన్నింటి కంటె అమూల్యమయినది,

చెక్కు లేదా ఏ బ్యాంక్‌దయినా డి.డి.ద్వారా ద్రవ్యాన్ని యీ చిరునామాకే అందించ గోరుచున్నాము.


వివరాలకు : ఫోన్ : 76356

పురాణపండ రాధాకృష్ణమూర్తి

భాగవత మందిరం - రాజమండ్రి - 4

దైవధర్మకార్యాలకు వాయిదాలు వేయకండి.

ధర్మమే సదా మిమ్మల్ని రక్షిస్తుంది.

సద్గ్రంథరత్న ప్రచురణకుముందుగా సహకరించండి.

సభ్యత్వరుసుము 150-00 లు మాత్రమే

కంఠంలో ప్రాణం వున్నంత వరకూ పారాయణ చేసికోదగిన 80 దివ్యస్తోత్రరత్నాలతో వినాయక వ్రతకల్ప, శ్రీరామపూజావిధాన, ఆంజనేయ పూజా విధాన, శ్రీరాజరాజేశ్వరీ పూజావిధాన, శ్రీలక్ష్మీ పూజావిధానాలతో అపూర్వ స్థాయిలో వృద్ధులు సయితం సునాయాసంగా పారాయణ చేసికోవాలన్న సత్సంకల్పంతో సుమారు లక్షరూపాయల వ్యయంతో యీ సద్గ్రంథ రత్నప్రచురణ ప్రచారాలకు పూనుకున్నాము.

రు 150-00లు ముందుగా అందజేయు వారికి

రిజిష్టర్డ్ పోస్ట్‌లో 5 ప్రతులు అందజేయ గలము.

---

ఈ చిరునామాకే ఎమ్.ఓ. ద్వారా ద్రవ్యంపంపండి.


**పురాణపండ రాధాకృష్ణమూర్తి**

భాగవతమందిరం - రాజమండ్రి-533 104

విశ్వవ్యాప్తంగా గల ఆంధ్ర ఆస్తిక సోదరసోదరీమణులకు సాదరాహ్వానం!

## సత్వర సహకారాన్ని అందించండి

లోక కళ్యాణార్థం భగవత్ ప్రేరణగా భావించి అత్యద్భుత ఫలప్రదాయకమైన శ్రీ రామ రక్షాస్తోత్రంయొక్క కోటి ప్రతుల ప్రచురణ విశేష ప్రచారాలకు పూనుకున్నాము. ది. 16.5.93 నాటికి 35లక్షల ప్రతులు ప్రచురించి దాతల ద్వారా వితరణ చేయించినాము.

తమ గోత్రనామాలపై రు.10,000.00లు అందజేయు వారికి బంగారంపై చెక్కబడి 40రోజులు పూజలో వుంచి సిద్ధిచేయబడిన శ్రీ రామరక్షా ధారణాయంత్రాన్నీ, షడంగుళ ప్రమాణంలో నరఘోష నివారకమైన పూజాయంత్రాన్నీ, కేసెట్స్‌తో సహా అందజేయగలము. వీరి కుటుంబపు ఫొటోతో, వంశపరిచయంతో శ్రీ రామరక్షాస్తోత్రమ్ యొక్క వేయి ప్రతులను అందజేసెదము.

---

ఈ క్రింది చిరునామాకు ద్రవ్యాన్ని అందజేయండి.


వివరాలకు : ఫోన్ : 76356.

**పురాణపండ రాధాకృష్ణమూర్తి**

29.16.13 డి. రాజమండ్రి –4.

ఆంధ్రప్రదేశ్ (ఇండియా)

ఓం శ్రీరామ జయ రామ జయ జయ రామ

# శ్రీ రామ రక్షాస్తోత్రము

కోటి ప్రతుల ప్రచురణ ప్రచారోద్యమ శాఖ

భావార్ధ సహితము

శ్రీ రామ రక్షాస్తోత్రము అత్యంత ఫలప్రదమయినది. సాధకుని శ్రద్ధ, భక్తి, భావములను అనుసరించి యిది లౌకిక పార లౌకికములగు సుఖముల నన్నియు లభింపజేయును. సిద్ధిచేసిన తరువాత యీ స్తోత్రమును పఠించుటవలన విశేషఫలము కలుగును.

## సిద్ధి చేయు విధానము

ఆశ్వయుజ శుక్లపక్షములో లేదా వసంత ఋతువులో లేదా ఓ శుభ ముహూర్తములో తొమ్మిది రోజులవరకు నిత్యం బ్రహ్మ ముహూర్తంలో సాధకుడు స్నానాది నియమిత నిత్యకర్మలు పూర్తి చేసుకుని శుద్ధవస్త్రములు ధరించి కుశాసనముపై (దర్భాసనము) సుఖాసీనుడు కావలెను. శ్రీరామచంద్ర భగవానుని పరమ కళ్యాణప్రద దివ్య మంగళ సుందర స్వరూపములో చిత్తమును ఏకాగ్రమొనర్చి అత్యంత శ్రద్ధావిశ్వాసములతో మహత్తరఫలములను ప్రసాదించు యీ స్తోత్రమును శక్తి ననుసరించి 11 పర్యాయములు లేదా సప్తపర్యాయములు నిత్యము నియమిత రూపేణా పఠింపవలెను. శ్రద్ధ ఎంత అఖండముగా నుండునో ఫలము కూడా దానిని అనుసరించియే వుండును.

వివాహ, ఋణవిముక్తి రోగనాశనము మానస సంకట నివారణము, విపత్తి నాశనము చింతానాశనాది ఎంతటి కష్టముల విషయములో నయినను దీనిని ప్రయోగింపవచ్చును. రోగివద్ద కూర్చుని నిత్యము శుద్ధ స్పష్ట రూపములో పఠించుటవలన సత్ఫలములు కలిగి తీరును.

# శ్రీ రామ రక్షా స్తోత్ర మహత్త్వం

శ్రీరామరక్షాస్తోత్రం ఓ మనోవైజ్ఞానికమైన ఓషధి, ఇందులో మానసిక రోగాలన్నీ దూరమై అలౌకిక మగు శక్తి ఉత్పన్నమయ్యే భావాలు నిండి ఉన్నాయి.

హద్దులు మీరి మీరు భయపడుతూన్నప్పుడు అశాంతి మిమ్మల్ని అణగద్రొక్కే స్థితిలో బ్రతకాలని మీకు లేని సమయంలో ఘోరమైన అశాంతి ద్వేషాదులతో మీ జీవనం గడుస్తూన్నపుడు జీవితం నీరసంగా, దుఃఖమయంగా వున్నప్పుడు లోకమంతా దయారహితంగా, పాఖండంగా గోచరించే వేళలో - మీరు అవశ్యం శ్రీరామ రక్షా స్తోత్రాన్ని పారాయణ చెయ్యండి. సూక్ష్మమైన ఆధ్యాత్మికశక్తితో అవశ్యం మీరు లాభాన్ని పొందుతారు. ధనబల, విద్యాబల, బుద్ధిబలాదుల కన్న మిన్న అయిన అధికబలం కలిగినట్టిది యీస్తోత్రము. దీనివల్ల దుష్టసంస్కారాలు దూరమై శుభసంస్కారాలు జాగృతమవుతాయి. ఆశాకిరణాలు బహిర్గతమవుతాయి. వేలాదిమంది "శ్రీరామ రక్షాస్తోత్రం" వల్ల మృత్యు, అశాంతి, ఉన్మాదం, ఆత్మహత్య ఆదిగా గల రోగాలనుండి సంరక్షింపబడ్డారు. దీనివల్ల శరీరం రోగ రహితమవుతుంది. ఆరోగ్యం వర్ధిల్లుతుంది. మస్తిష్కమూ జ్ఞానతంతువులూ పరిపుష్టమవుతాయి. స్మరణ శక్తి తీవ్రమవుతుంది. రక్తచాపం (బ్లడ్‌ప్రెషర్) హృదయరోగాలు సమూలంగా నిర్మూలమవుతాయి. మానసిక ఆరోగ్య సంతులనార్థం దీనిని నిత్యం పారాయణ చెయ్యాలి. అనుదినం ప్రతివ్యక్తి ముఖ్యంగా శ్రీరామ భక్తులూ పూజతో బాటు దీనిని అభ్యసించాలి.

(సిద్ధ్యర్థం నిత్యం 11 పారాయణాల వంతున 9రోజులు పారాయణ చెయ్యాలి.)

---

**వివరములకు :**

పురాణపండ రాధాకృష్ణమూర్తి

**సంస్థాపకుడు, భాగవతమందిరం, జయశ్రీ టాకీస్‌రోడ్,**

**డోర్ నెం. 29.6.13 డి, రాజమండ్రి - 4.**

ఓం శ్రీ గణేశాయ నమః అస్య శ్రీరామరక్షాస్తోత్ర మంత్రస్య బుధ కౌశిక ఋషిః
శ్రీ సీతారామచంద్రో దేవతా అనుష్టుప్ ఛందః! సీతాశక్తిః
శ్రీమాన్ హనుమాన్ కీలకం శ్రీరామచంద్ర ప్రీత్యర్థే రామ రక్షా స్తోత్ర జపే వినియోగః

తాత్పర్యము ॥ ఈ రామరక్షా స్తోత్రానికి ఋషి బుధకౌశికుడు, దేవతలు సీతారాములు, శక్తిసీత, కీలకము హనుమంతుడు, దీని వినియోగము శ్రీరామచంద్రుని ప్రసన్నత కొరకు వున్నది. అందుకే రామరక్షా స్తోత్ర జపములో దీని వినియోగము వున్నది.

## ధ్యానం

ధ్యాయే దాజానుబాహుం ధృతశరధనుషం బద్ధ పద్మాసనస్థమ్
పీతం వాసోవసానం, నవకమల దళస్పర్థి నేత్రం ప్రసన్నమ్
వామాంకారూఢ సీతా ముఖకమల మిలల్లోచనం నీరదాభమ్
నానాలంకార దీప్తం దధత మురుజటామండలం రామచంద్రమ్.

తా॥ ధనుర్బాణములను ధరించినవాడు, బద్ధ పద్మాసన విరాజమానుడు, పీతాంబరధారీ, నూతన కమల దళములతో స్పర్ధకలిగియున్న ప్రసన్న నయనుడు, వామభాగమున విరాజిల్లు సీతాముఖ కమలముతో కలిసి యున్నవాడు, ఆజానుబాహువు, మేఘశ్యాముడు, వివిధాలంకార విభూషితుడు విశాల జటాజూటధారీ అయిన శ్రీరామచంద్రుని ధ్యానించవలెను.

# శ్రీ రామ రక్షా స్తోత్రం

శ్లో॥ చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరమ్
ఏకైక మక్షరం పుంసాం మహాపాతక నాశనమ్ ॥

తా॥ శ్రీరఘునాథుని చరిత్ర శతకోటి ప్రవిస్తరమై యున్నది. అందలి ఒక్కొక్క అక్షరము కూడ మనుష్య మాత్రుని మహాపాపములను నాశనము చేయును.

శ్లో॥ ధ్యాత్వా నీలోత్పల శ్యామం రామం రాజీవలోచనమ్
జానకీ లక్ష్మణోపేతం జటామకుట మండితమ్ ॥

శ్లో॥ సాఽసితూణ ధనుర్బాణ పాణిం నక్తం చరాంతకమ్
స్వలీలయా జగత్త్రాతు మావిర్భూత మజం విభుమ్ ॥

శ్లో॥ రామరక్షాం పఠేత్ ప్రాజ్ఞః పాపఘ్నీం సర్వకామదామ్
శిరో మే రాఘవః పాతు ఫాలం దశరథాత్మజః ।

నీలకమల దళశ్యాముడును, కమలనయనుడు, జటామకుట సుశోభితుడును, ఖడ్గ, తూణీర, ధనుర్బాణధారియు, రాక్షస సంహారకారియు జగత్ రక్షణార్థమే తన లీలచే అవతరించిన వాడును, అజన్ముడును సర్వవ్యాపకుడు అయిన శ్రీరామ భగవానుని సీతాలక్ష్మణ సమేతముగా స్మరించి ప్రాజ్ఞ పురుషుడు సర్వకామప్రదమై పాపములను నాశనము చేయునదైన యీ రామరక్షాస్తోత్రమును పఠింపవలెను. నా శిరస్సును రాఘవుడును లలాట భాగమును దశరథాత్మజుడను రక్షించు గాక !

శ్లో॥ కౌసల్యేయో దృశౌపాతు విశ్వామిత్రః ప్రియః శృతీ
ఘ్రాణం పాతు మఖత్రాతా ముఖం సౌమిత్రి వత్సలః ॥

తా॥ కౌసల్యానందనుడు నేత్రములను రక్షించుగాక! విశ్వామిత్ర ప్రియుడు కర్ణములను సురక్షితముగా వుంచును గాక! యజ్ఞ రక్షకుడు జ్ఞానేంద్రియములను, సౌమిత్రి వత్సలుడు, ముఖమును రక్షించును గాక!

శ్లో॥ జిహ్వాం విద్యా నిధిః పాతు కంఠం భరత వందితః
స్కంధౌ దివ్యాయుధః పాతు భుజౌ భగ్నేశ కార్ముకః ।

తా॥ నా జిహ్వను విద్యానిధియు, కంఠమును భరతవందితుడును, స్కంధములను దివ్యాయుధుడును భుజములను శివధనుర్భంగము చేసిన వాడును రక్షించును గాక !

శ్లో॥ కరౌ సీతాపతిః పాతు హృదయం జామదగ్న్యజిత్
మధ్యం పాతు ఖరధ్వంసీ నాభిం జాంబవదాశ్రయః ॥

తా॥ హస్తములను సీతాపతియు, హృదయమును పరుశురామ విజేతయు, మధ్య భాగమును ఖర రాక్షసాంతకుడును నాభిని జాంబవ దాశ్రయడును రక్షించును గాక!

శ్లో॥ సుగ్రీవేశః కటీ పాతు సక్థినీ హనుమత్ప్రభుః ।
ఊరూ రఘూత్తమః పాతు రక్షఃకుల వినాశకృత్ ॥

తా॥ కటి భాగమును సుగ్రీవస్వామియు, సక్థినిని హనుమత్ప్రభువును జఘన భాగములను, రాక్షసకుల వినాశకుడగు రఘుకుల శ్రేష్ఠుడును రక్షించును గాక.

రాం – రామాయ నమః

శ్లో॥ జానునీ సేతుకృత్పాతు జంఘే దశముఖాంతకః ।
పాదౌ విభీషణ శ్రీదః పాతు రామోఽఖిలం వపుః ॥

తా॥ జానువులను (మోకాళ్ళను) సేతు నిర్మాతయు జఘనములను (మణికట్టును) దశ ముఖాంతకుడును, చరణములను విభీషణునికి ఐశ్వర్యము ప్రసాదించిన వాడును సంపూర్ణ శరీరమును శ్రీరాముడును రక్షించును గాక!

శ్లో॥ ఏతాం రామబలోపేతాం రక్షాం యః సుకృతీ పఠేత్ ।
స చిరాయుః సుఖీ పుత్రీ విజయీ వినయీ భవేత్ ॥

తా॥ ఏ పుణ్యాత్ముడు రామబల సంపన్నమగు యీ రామరక్షా స్తోత్రమును పఠించునో అట్టివాడు దీర్ఘాయువుతో సుఖియై పుత్రవంతుడు విజయశీలుడనై వినయ సంపన్నుడగును.

శ్లో॥ పాతాళ భూతల వ్యోమ చారిణశ్ఛద్మ చారిణః ।
న ద్రష్టు మపి శక్తాస్తే రక్షితమ్ రామనామభిః ।

తా॥ పృథివ్యాకాశ పాతాళ లోకములలో ఛద్మ వేషముతో పరిభ్రమించే యే జీవియైనను సరే రామ నామ సురక్షితుడైనట్టి పురుషుని కన్నెత్తి చూడలేదు.

శ్లో॥ రామేతి రామభద్రేతి రామచంద్రేతి వా స్మరన్
నరో న లిప్యతే పాపైర్భుక్తిం ముక్తిం చ విందతి ॥

తా॥ " రామ " " రామభద్ర " " రామచంద్ర " యీ నామములను స్మరించుటవల్ల మనుష్యుడు పాప విముక్తుడగుటయే కాక భోగమోక్షములను కూడ పొందగలుగును.

శ్లో॥ జగజ్జైత్రైక మంత్రేణ రామనామ్నాభి రక్షితమ్ ।
యః కంఠే ధారయేత్తస్య కరస్థాః సర్వ సిద్ధయః ॥

తా॥ జగత్తును జయించుటకు ఏకమాత్ర మంత్రమైన రామనామముచే సురక్షితమైన యీ స్తోత్రమును కంఠస్థము చేయువానికి సమస్త సిద్ధులు కరతలామలకములగును.

శ్లో॥ వజ్రపంజర నామేదం యో రామకవచం స్మరేత్
అవ్యాహతాజ్ఞః సర్వత్ర లభతే జయమంగళం ॥

తా॥ వజ్రపంజర నామకమగు యీ రామ కవచమును స్మరించు వాని ఆజ్ఞలను ఎవ్వరూ ఉల్లంఘించ జాలరు. వానికి సర్వే సర్వత్రా జయ మంగళములు ప్రాప్తించును.

శ్లో॥ ఆదిష్టవాన్ యథా స్వప్నే రామ రక్షామిమాం హరః ।
తథా లిఖితవాన్ ప్రాతః ప్రబుద్ధో బుధకౌశికః ॥

తా॥ రాత్రి స్వప్నమునందు తనకు యీ రామరక్షను శంకర భగవానుడు ఆదేశించినట్లుగనే ప్రాతఃకాలమున మేల్కాంచిన పిమ్మట బుధ కౌశిక మహర్షి దీనిని వ్రాసెను.

శ్లో॥ ఆరామః కల్పవృక్షాణాం విరామః సకలాపదామ్ ।
అభిరామస్త్రిలోకానామ్ రామః శ్రీమాన్సనః ప్రభుః ॥

తా ॥ కల్పవృక్షములతో కూడిన ఉద్యానవనమువంటి వాడును సమస్త ఆపదలను రూపుమాపువాడును ముల్లోకములలో పరమ సుందరుడును అయిన శ్రీరామచంద్రుడే మా ప్రభువు.

శ్లో॥ తరుణౌ రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ ।
పుండరీక విశాలాక్షౌ చీరకృష్ణాజినాంబరౌ ।

శ్లో॥ ఫలమూలాశినౌ దాంతౌ తాపసౌ బ్రహ్మచారిణౌ ।
పుత్రౌ దశరథ స్యైతౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ ।

శ్లో॥ శరణ్యౌ సర్వసత్వానాం శ్రేష్ఠౌ సర్వధనుష్మతామ్ ।
రక్షఃకుల నిహంతారౌ త్రాయేతాం నో రఘూత్తమౌ ।

తా ॥ తరుణ వయస్కులు రూప సంపన్నులు, మహా బలశాలురు కమల సదృశ విశాల నేత్రములు కలవారు, చీరవస్త్ర, కృష్ణ మృగ చర్మధారులు, ఫల మూలములను ఆహారముగా గైకొనువారు, సంయమన చిత్తులు, తపస్వులు సమస్త జీవులకు శరణిచ్చువారు ధనుర్ధారులందరిలోను శ్రేష్ఠులు, రాక్షస కులనాశకులు అయిన రామలక్ష్మణ సోదరులిద్దరు మనలను రక్షించు గాక !

శ్లో॥ ఆత్తసజ్యధనుషావిషుస్పృశావక్షయాశుగ నిషంగసంగినౌ ।
రక్షణాయ మమ రామలక్ష్మణావగ్రతః పథి సదైవ గచ్ఛతామ్ ।

తా॥ నారి సారించిన ధనుస్సులు చేబూనిన వారును, బాణముపై హస్తములను త్రిప్పుచుండువారును, అక్షయ బాణయుక్త తూణీర ధారులును అయిన రామలక్ష్మణులు నన్ను రక్షించుట కొరకు మార్గములో సదా నాకు ముందుండెదరు గాక.

శ్లో॥ సన్నద్ధః కవచీ ఖడ్గీ చాపబాణధరో యువా ।
గచ్ఛన్ మనోరథాన్నశ్చ రామః పాతు స లక్ష్మణః ।

తా॥ సర్వకాల సర్వావస్థలయందు, సన్నద్ధులై యుండువారు, కవచధారులై, ఖడ్గ పాణులై ధనుర్బాణధారులై యువావస్థలోవుండు నట్టి శ్రీరామ భగవానుడు లక్ష్మణ సహితుడై మున్ముందు నడచుచు మనలను మన మనోరథములను రక్షించును గాక !

శ్లో॥ రామో దాశరథిశ్శూరో లక్ష్మణానుచరో బలీ ।
కాకుత్స్థః పురుషః పూర్ణః కౌశల్యేయో రఘూత్తమః ॥

శ్లో॥ వేదాంతవేద్యో యజ్ఞేశః పురాణ పురుషోత్తమః ।
జానకీ వల్లభః శ్రీమా నప్రమేయ పరాక్రమః ॥

శ్లో॥ ఇత్యేతాని జపేన్నిత్యం మద్భక్తః శ్రద్ధయాన్వితః
అశ్వమేధాధికం పుణ్యం సంప్రాప్నోతి న సంశయః ॥

తా॥(భగవత్కథన మేమన) రామ, దాశరథి, శూర, లక్ష్మణానుచర, బలి కాకుత్స్థ పరమపురుష, పూర్ణ కౌసల్యేయ రఘూత్తమ వేదాంతవేద్య, యజ్ఞేశ పురాణ పురుషోత్తమ జానకీవల్లభ! శ్రీమాన్ అప్రమేయ పరాక్రమ యీ నామములను ప్రతి నిత్యము శ్రద్ధా పూర్వకముగా జపించు నా భక్తుడు అశ్వమేధ యాగము కన్నను మిన్నయైన అధిక ఫలము పొందు ననుటలో సందేహము లేదు.

శ్లో॥ రామం దూర్వాదళశ్యామం పద్మాక్షం పీతావాససమ్ ।
స్తువంతి నామభిర్దివ్యైర్నతే సంసారిణో నరాః ।

తా॥ దూర్వాదళ సదృశశ్యామ వర్ణుడును, కమలనేత్రుడును పీతాంబరధారియు అయిన శ్రీరామభగవానుని యీ దివ్య నామములను కీర్తించు వారు సంసార సాగరములో పడరు.

శ్లో॥ రామం లక్ష్మణపూర్వజం రఘువరం సీతాపతిం సుందరమ్
కాకుత్థ్సం కరుణార్ణవం గుణనిధిం విప్రప్రియం ధార్మికమ్
రాజేంద్రం సత్యసంధం దశరథతనయం శ్యామలమ్ శాంతమూర్తిమ్
వందే లోకాభిరామం రఘుకులతిలకం రాఘవం రావణారిమ్.

తా॥ లక్ష్మణాగ్రజుడును రఘుకుల శ్రేష్ఠుడును, సీతాపతియును, అత్యంత సుందరుడును, కకుత్థ్సకుల నందనుడును కరుణా సాగరుడును గుణనిధానుడును, బ్రాహ్మణ ప్రియుడును రాజ రాజేశ్వరుడును, సత్యప్రతిజ్ఞుడును దశరథపుత్రుడును, శ్యాముడును, శాంతమూర్తియు, సర్వలోక సుందరుడును రఘుకుల తిలకుడును రాఘవుడును రావణారియును, అయిన రామభగవానునకు నేను వందన మాచరించుచున్నాను.

శ్లో॥ రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే ।
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః ॥

తా ॥ రామా, రామభద్రా! రామచంద్రా ! విధాతృ స్వరూపా, రఘునాథా ! ప్రభూ, సీతా పతివీ అయిన నీకు నమస్కారము.

శ్లో॥ శ్రీరామ రామ రఘునందన రామరామ ।
శ్రీరామ రామ భరతాగ్రజ రామరామ ।
శ్రీరామ రామ రణకర్కశ రామ రామ ।
శ్రీరామ రామ శరణం భవ రామ రామ ॥

తా ॥ ఓ రఘునందనా, శ్రీరామా ! భరతాగ్రజా । భగవంతుడవగు ఓరామా ! ఓ రణకర్కశ ప్రభువైన రామా ! నీవు రక్షకుడవు కమ్ము.

శ్లో॥ శ్రీరామ చంద్ర చరణౌ మనసా స్మరామి ।
శ్రీరామ చంద్ర చరణౌ వచసా గృణామి ॥
శ్రీరామ చంద్ర చరణౌ శిరసా నమామి ।
శ్రీరామ చంద్ర చరణౌ శరణం ప్రపద్యే ॥

తా । శ్రీరామ చంద్రుని చరణములను నేను మనసా స్మరించుచున్నాను. శ్రీరామచంద్రుని చరణములను వాక్కు ద్వారా నేను కీర్తించుచున్నాను, శ్రీరామచంద్రుని చరణములకు శిరస్సు వంచి నమస్కరించుచున్నాను. శ్రీరామచంద్రుని చరణములను నేను శరణు వేడుచున్నాను.

శ్లో॥ మాతా రామో మత్పితా రామచంద్రః
స్వామీ రామో మత్సఖా రామచంద్రః
సర్వస్వం మే రామచంద్రో దయాళుః
ర్నాన్యం జానే నైవ జానే న జానే.

తా । రాముడు నా తల్లి. రామచంద్రుడు నా తండ్రి. రాముడు నా ప్రభువు. రామచంద్రుడే నా సఖుడు. దయామయుడైన రామచంద్రుడే నా సర్వస్వము. అతనిని వినా నేను మరెవరినీ యెంత మాత్రమూ ఎరుగను.

శ్లో॥ దక్షిణే లక్ష్మణో యస్య వామే చ జనకాత్మజా ।
పురతో మారుతిర్యస్య తం వందే రఘునందనమ్ ॥

తా । దక్షిణ భాగములో లక్ష్మణుడు వామాంకమున జానకీ దేవియు సమ్ముఖమున ఆంజనేయుడును విరాజిల్లుచుండగా భాసిల్లునట్టి రఘునాథునకు నేను వందన మాచరించుచున్నాను.

శ్లో॥ లోకాభిరామం రణరంగధీరం।
రాజీవనేత్రం రఘువంశనాథమ్ ।
కారుణ్యరూపం కరుణాకరం తం।
శ్రీరామచంద్రం శరణం ప్రపద్యే ॥

తా ॥ పరిపూర్ణత్వముగల సుందరుడును, రణక్రీడలో ధీరుడును, కమలనయనుడును, రఘువంశ నాయకుడును కరుణామూర్తియు, కరుణానిధియు అయిన శ్రీరామచంద్రుని నేను శరణు వేడుచున్నాను.

శ్లో॥ మనోజవం మారుతతుల్య వేగమ్
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్టమ్
వాతాత్మజం వానర యూథముఖ్యమ్
శ్రీరామదూతం శరణం ప్రపద్యే ॥

తా॥ మనస్సమానగతితో వాయు సదృశవేగంతో పరమ జితేంద్రియుడై శ్రీమంతులలో శ్రేష్ఠుడైన పవన నందనుడు వానరాగ్రగణ్యుడు అయిన శ్రీరామ దూతను నేను శరణు వేడుచున్నాను.

శ్లో॥ కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్ ।
ఆరుహ్య కవితా శాఖాం వందే వాల్మీకి కోకిలం ॥

శ్లో॥ ఆపదా మపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్॥

తా॥ ఆపదలను హరించువాడును సమస్త సంపదలను ప్రసాదించువాడును లోకాభి రాముడును అయిన రామ భగవానునకు నేను మాటిమాటికి నమస్కరించుచున్నాను.

శ్లో॥ భర్జనం భవబీజానా మర్జనం సుఖసంపదామ్ ।
తర్జనం యమదూతానాం రామరామేతి గర్జనమ్ ॥

తా॥ "రామ, రామ" అని యీ ప్రకారముగా ఘోషించుట సంపూర్ణ సంసార బీజములను వేయించి వేయునదియు సమస్త సుఖసంపత్తులను ప్రాప్తింపచేయునదియు యమదూతలను భయభీతుల నొనర్చునదియు అయి యున్నది.

శ్లో॥ రామో రాజమణిస్సదా విజయతే రామం రమేశం భజే
రామేణాభిహతా నిశాచర చమూ రామాయ తస్మై నమః
రామాన్నాస్తి పరాయణం పరతరం రామస్య దాసోస్మ్యహం
రామే చిత్తలయ స్సదా భవతుమే భో రామ మాముద్ధర. ॥

తా॥ రాజశ్రేష్ఠుడైన శ్రీరామచంద్రుడుసదా విజయశీలుడై యుండును. లక్ష్మీపతియగు రామ భగవానుని నేను భజించెదను. రాక్షస సైన్య సర్వస్వమును ధ్వంస మొనర్చిన శ్రీరామచంద్రునకు నేను ప్రణమిల్లు చున్నాను. రామునికన్న ఘనమై అన్యమయిన ఆశ్రయము మరియొకటి లేదు. నేను అట్టి రాముని దాసుడను. నా చిత్తము సదా రామునియందే లగ్నమయి యుండు గాక! ఓ రామా! నీవు నన్నుద్ధరింపుము.

శ్లో॥ శ్రీ రామ రామ రామేతి రమే రామే మనోరమే ।
సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే ॥

తా॥ ( శ్రీశంకరుడు పార్వతీ దేవితో ఇట్లు పలుకుచున్నాడు) ఓ సుముఖీ! రామనామము విష్ణు సహస్రనామ తుల్యమైనది. నేను సర్వదా రామ, రామ, రామ, అని యీ ప్రకారముగా మనోహరమైన రామనామమునందే రమించు చుందును.

**( ఇతి శ్రీ బుధకౌశికముని విరచితం శ్రీ రామరక్షాస్తోత్రం సంపూర్ణం)**

# మారుతిస్తోత్రమ్

ఓం నమో భగవతే విచిత్ర వీరహనుమతే ప్రళయ కాలానల ప్రజ్వలనాయ ప్రతాప వజ్రదేహాయ అంజనీ గర్భ సంభూతాయ ప్రకట విక్రమ వీరదైత్య దానవ యక్ష రక్షోగణ గ్రహబంధనాయ భూత గ్రహ బంధనాయ ప్రేతగ్రహ బంధనాయ పిశాచ గ్రహ బంధనాయ శాకినీ డాకినీ గ్రహ బంధనాయ కాకినీ కామినీ గ్రహబంధనాయ బ్రహ్మ గ్రహబంధనాయ బ్రహ్మరాక్షస గ్రహ బంధనాయ చోర గ్రహ బంధనాయ మారీ గ్రహ బంధనాయ ఏహి ఏహి ఆగచ్ఛ ఆగచ్ఛ ఆవేశయ ఆవేశయ మమ హృదయే ప్రవేశయ ప్రవేశయ స్ఫుర స్ఫుర ప్రస్ఫుర ప్రస్ఫుర సత్యం కథయ వ్యాఘ్రముఖ బంధన సర్పముఖ బంధన రాజముఖ బంధన నారీముఖ బంధన సభాముఖ బంధన శత్రుముఖ బంధన సర్వముఖ బంధన లంకా ప్రాసాద భంజన అముకం మే వశమానయ క్లీం క్లీం క్లీం హ్రీం శ్రీం శ్రీం రాజానం వశమానయ శ్రీం హ్రీం క్లీం స్త్రీణాం ఆకర్షయ ఆకర్షయ శత్రూన్మర్దయ మర్దయ మారయ మారయ చూర్ణయ చూర్ణయ ఖేఖే శ్రీరామ చంద్రాజ్ఞయా మమకార్యసిద్ధిం కురు కురు ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః ఫట్ స్వాహా విచిత్ర వీర హనుమాన్ మమ సర్వ శత్రూన్ భస్మ కురుకురు హనహన హుం ఫట్ స్వాహా.

# హనుమత్ బడబానల స్తోత్రమ్

## ఓం శ్రీ రామాయ నమః

ఓం అస్య శ్రీహనుమద్బడబానల సోత్ర మంత్రస్య శ్రీరామచంద్ర ఋషిః శ్రీబడబానల హనుమాన్ దేవతా మమ సమస్త రోగప్రశమనార్థం ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృద్ధ్యర్థం సమస్త పాపక్షయార్థం సీతారామ చంద్ర ప్రీత్యర్థం హనుమద్బడబానల స్తోత్ర జపమహం కరిష్యే.

ఓం హ్రాం హ్రీం ఓం నమో భగవతే శ్రీ మహా హనుమతే ప్రకట పరాక్రమ సకల దిఙ్మండల యశో వితాన ధవళీకృత జగత్రితయ వజ్రదేహ రుద్రావతార లంకాపురీదహన ఉమా అనలమంత్ర ఉదధిబంధన దశశిరః కృతాంతక సీతాశ్వాసన వాయుపుత్ర అంజనీగర్భ సంభూత శ్రీరామ లక్ష్మణానందకర కపిసైన్య ప్రాకార
సుగ్రీవ సాహాయ్య కరణ పర్వతోత్పాటన కుమార బ్రహ్మచారిన్ గంభీరనాద సర్వ పాపగ్రహవారణ సర్వజ్వరోచ్చాటన డాకినీవిధ్వంసన ఓం హ్రాం హ్రీం ఓం నమో భగవతే మహావీరాయ సర్వదుఃఖ నివారణాయ గ్రహమండల సర్వభూతమండల సర్వపిశాచమండలోచ్చాటన భూతజ్వరై కాహికజ్వర మహేశ్వర వైష్ణవజ్వరాన్ ఛింది ఛింది ఛింది ఛింది యక్షరాక్షసభూత ప్రేత పిశాచన్ ఉచ్చాటయ ఉచ్చాటయ ఓం హ్రాం శ్రీం ఓం నమోభగవతే శ్రీ మహాహనుమతే ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః ఆం హాం హాం హాం ఔం సౌం ఏహి ఏహి ఓంహం ఓంహం ఓంహం ఓం నమో భగవతే శ్రీ మహాహనుమతే శ్రవణ చక్షుర్భూతానాం శాకినీ డాకినీ విషమ దుష్టానాం సర్వవిషం హరహర ఆకాశ భువనం భేదయ భేదయ ఛేదయ ఛేదయ మారయమారయ శోషయ శోషయ మోహయ మోహయ జ్వాలయ జ్వాలయ ప్రహారయ ప్రహారయ సకల మాయాం భేదయ భేదయ ఓం హ్రాం హ్రీం ఓం నమో భగవతే మహాహనుమతే సర్వగ్రహోచ్చాటన పరబలం క్షోభయ క్షోభయ సకల బంధన మోక్షణం కురుకురు శిరః శూల గుల్మశూల సర్వశూల నిర్మూలయ నిర్మూలయ నాగపాశానంత వాసుకి తక్షక కర్కోటక కాళియాన్ యక్షకుల జలగత బిలగత రాత్రించర దివాచర సర్పాన్నిర్విషం కురుకురు స్వాహా రాజభయ చోరభయ పరమంత్ర పరయంత్ర పరతంత్ర పరవిద్యా చ్ఛేదయ చ్ఛేదయ స్వమంత్ర స్వయంత్రస్వవిద్యాః ప్రకటయ ప్రకటయ సర్వారిష్టాన్నాశయ నాశయ సర్వశత్రూన్నాశయ నాశయ అసాధ్యం సాధయ సాధయ హుం ఫట్ స్వాహా.

